# హిందువులు, మహమ్మదీయులును ఆర్యులా?

## డా. ప్రాణనాథుగారి సిద్ధాంత విమర్శ

(పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు)

గోలకొండపత్రిక (౧౫-౭-౧౯౪౧) లోని శ్రీడా. ప్రాణనాథ విద్యాలంకారు గారి యుపన్యాస సారాంశమును పాఠకులు గమనించియుందురు. ప్రాచీనకాలమందు ఏకజాతిగానున్న ఆర్యులే తరువాయి హిందువులు గాను మహమ్మదీయులు గాను భేదమునందరిని నచ్చరించుచున్నట్లు తెలిసి సంతసించనివారుండరు. సర్ హైదరీగారివంటి మహామహుల ప్రోత్సాహమున డా. ప్రాణనాథు గారిచే విద్వాంసుల పరిశోధనఫలముగ నీసిద్ధాంతము తెలిసినచో భారతదేశమునకు ఐకమత్యపిపాసమును సులభముగ చార్చుకోవచ్చును- ఆర్యులనంద జాలేదు ఆర్యులమనియే ప్రచారము చేయుచున్నారు. యూరోపీయనులు ఒకవిధముగ తమమిత్రార్యత్వమునంగీకరించియున్నారు- చీనా జపాను అంతా బర్మాజావానివాసులు బౌద్ధులేకావున అచ్చముగ ఆర్యదత్తోద్భవులనుటలో సందేహము లేదు. ఏషియామైనారింటనున్న రషియనులను ఆర్యసోదరులంకారవారు అమెరికాయన గాప్రాచీనఅమెరికనులనియును, మనప్రాచీనులగుఅసురులు నివసించి వారేయిట్లుమారిరనియు ౧౯౩౮ మార్చి మాసమునకో డాక్టరు గారు అభినానగరములో నుపన్యసించిరి!- అసలుఆదికాలమున మానవజాతియంతయు ఏకమనియును, ధర్మభేదము లేకుండెననియును, చరిత్రవిమర్శకులు వాకొనుచు నేయున్నారు- తమపూర్వమతమును మార్పుకొని మహమ్మదీయమునలోనికో, క్రైస్తయానిటియందో, బౌద్ధమునకో, హె. చార్వాకునందో, ప్రవేశించువిపులమైన జనసంఖ్యనునమను కనుగొనుచు నేయున్నాము, మనమిత్తర్వ సిద్ధతితో సాగించువో ఏపరిశోధనలు మిక్కిలిలేవు- "అంతా బ్రహ్మమయం జగమంతా బ్రహ్మమయం" తత్త్వమను "సర్వంఖల్విదం బ్రహ్మ" యని యుపనిషత్తులుపదేశించి కనీసము రెండువేలసంవత్సరములు గడచినవి- కాని శ్రీ ప్రాణనాథు గారినిరూపణసరణి యిట్టిదికాదు- తమవాదమునకు వాఙ్మయప్రమాణములను చూపకలసియుందురు- కావునతక్రిందినివేదనను వారుచిత్తగింప గోరుచున్నాను-

డా. ప్రాణనాథు గారి మొన్నటి హైదరాబాదు యుపన్యాసమును ప్రత్యక్షముగ వినుటతటస్థించకేదు కానివారు కాశీవాసులుకావునను వారియుపన్యాసములను వాయద్ధ్యయన కాలమున వినియుండుటవలనను, పూర్వవిషయమునుకొంతవరకు పురస్కరించుకొని నేసిద్ధానిని వ్రాయుచున్నాను- ఇటీవలలభించిన సింధులోని మొహంజదాడో పంజాబులోనిహరప్పయును ప్రాచీనావశిష్టములపై కొంతలిపి కనుపడుచున్నది- ఈలిపిని డా. మార్షల్, డా. హెరాస్ మున్నగుపాశ్చాత్య పండితులు పరిశీలించుచు యథేచ్ఛముగ ననేకవ్యాసములలో తమభావమును వెల్లడించియున్నారు- వారు చదివిన అక్షరములును, సంయుక్తపద్ధతియును, సరియైనదని నాబోటియల్పజ్ఞుడునమ్మలేకున్నాడు- ఒకరు ఆర్యలిపియనగా మరియొకరుదానినే ద్రావిడలిపియనిరి- ఒకరు 'కమ్మో' యనిచదువగా నికొకరు 'మీన' యనిపఠించిరి- యుక్తులావగించవో తెనుగుపూవాల చలరాజమువలెనుగవ్పట్టును- ఇదిశైవశాక్తవాఙ్మయమని చెప్పువారిలో ప్రాణనాథు గారొకరు- ఈలిపిమాటనుగూర్చియును, మతతత్త్వము ననుగూర్చియును ఇటీవల ప్రాణనాథు గారేదేని పుస్తకమును ప్రకటించిరేమో! తెలియదు- ఈపత్రికలో ప్రచురింపబడినవారి యుపన్యాసము ధోరణి చూడగా నదికేవలము ఊహాగానమువలె నగుపడుటచే విమర్శింపవలసివచ్చినది- వేదాదివాఙ్మయములోతప్ప అంతకంటె ప్రాచీనమ లనిపేరునమ్మినవారప్ప మొహంజదాడో ఆసీరియా ఈజిప్టులలోని శాసనలిపులలో ఎక్కడను ఆర్యజాతిశబ్దము రాలేదు- ఈప్రాక్కాలికమానవులందరు ఆర్యులనుటకు ప్రమాణములులేవు- ఆసలే పేరూరులు తెలియనిఈమనుష్యులు మధ్యప్రాచ్యము [సెంట్రల్ ఏషియా]లో పుట్టిరనుటయును, వీరుఆర్యులనుటయును పొసగనిమాట- ఒకవేళ ఒకచోటనే పుట్టియున్నట్లు మనమంగీకరించినను భారతదేశముయొక్క లిపి, ఉచ్చారణ వ్రాయుపద్ధతి, అక్షరములఅధికసంఖ్య, భాష, వ్యాకరణము మున్నగువానికిని, పర్షియా, అసీరియా, ఈజిప్టుదేశముల యొక్క లిపిభాషలకును భూమ్యాకాశములంతభేదముకలదు- వీరుపూర్వముఖముగాను వారుపశ్చిమముఖముగాను, భాషలోను, ప్రార్థనలోను ఉన్నారనుసంగతిప్రత్యక్షము- వీరికియజ్ఞయాగములును, పార్సీవారిఅగ్నిపూజను, చూచి కొందరు భ్రమపడిరి- ఇట్టిసామ్యము అమెరికాలోని యొకప్రాచీనజాతిలోను చూపింపవచ్చును- ఇట్టిపద్ధతితోడ ఐతిహాసికులకుసమాధానము చెప్పజాలము.

అసలు ఆర్యజాతివాదమును, అనార్యజాతివాదమును మొట్టమొదలు మనకు వేదములోతప్ప అంతకంటె ప్రాచీనములైన నుర్కయేశాసనముల లోను కనుపడలేదు. వేదమందలి ఆర్యశబ్దము ఒకజాతినినిర్వచించునంతటిదికాదు, ఆర్యుడు అనగా సజ్జనుడు, భద్రపురుషుడు (జంటిల్ మెన్) అనుకొనవచ్చును ఒకవేళ అది జాతివాచకమేయని నిశ్చయమగుచో వేద సమకాలికులే ఆర్యులగుదురు. అదియును ఆవేదమందలి యుపదేశప్రకారము వైదికదేవతలను ఉపాసించి వైదికకర్మల నాచరించుచు వైదికపక్షపాతము గలవారు మాత్రమే ఆర్యులగుటపొసగును కాని "ఏతద్భిన్నులు ఆర్యులగుటకేమాత్రము వీలులేదు. మధ్యప్రాచ్యమునుండి ఆర్యులురొడబాసి వివిధదేశములకు పోయినందువలన పశ్చిమదేశపుమహమ్మదీయాదులు వైదికసంస్కృతినివిస్మరించియుందురని వీరందురేమో! అట్లగుచో భారతీయులొకరు తప్ప తక్కినఇతరదేశవాసులందరును వేదాదులను మరచి తరువాత క్రొత్తగ లిపి భాషలను, మతములను నిర్మించుకొనినట్లు స్పష్టపడగలదు- దీనివలన నే భారతీయ వైదికులొకరుమాత్రమే ఆర్యులని ధ్రువపడగలదు- భారతీయులుతప్ప మరొకరు ప్రాచీనకాలమున వేదము నుచ్చరించి సంస్కృతభాషలో సంకల్పము చెప్పుకొనినట్లు వాఙ్మయమునుండి ఒకప్రమాణమునైనను శ్రీప్రాణనాథు గారు చూపింపగలరా! పరిశోధకపండితలోకము బ్రహ్మోత్సవము బట్టగలదు. వేదమునకంటెపూర్వము భారతీయులయొక్కయు లేక మధ్యప్రాచ్యులయొక్కయు మతజీవితముగూర్చి గాని శ్రీ మహమ్మదుకంటెపూర్వము ఈరాణదేశీయుల మతమునుగూర్చి గాని ఒకధ్రువతరమైనసిద్ధాంతము చెప్పలేనప్పుడు వీరిదివారిది ఆర్యమనుటయు వైదికమనుటయు పరిహాసాస్పదము- భారతీయులయొక్క వైదికసాహిత్యమునుండియు భాషనుండియు శాస్త్రములనుండియు ఇతరదేశీయులు సహాయము పొందియున్నారనుటలో వివాదము లేదు- అదియెప్పుడు ఏవిధముగ జరిగినదో నిరూపింపవచ్చునుగాని హిందూమహమ్మదీయు లిరువురును ఆర్యజాతివారనుట పొసగనిసంగతి. మానవజాతిత్వము నుబట్టి అంతయు నొకటియేయని చాలతేలికగా చెప్పవచ్చును ఆర్యమతము, మహమ్మదీయమతములను ప్రత్యేకసంస్థలుఏర్పడినపిదప నేవిప్రాచీనము, ఏమతమునెవరనుకరించిరి, ఎవరినుండిఎవరు పుట్టిరి. అనుసంశయములను విడదీయుటకు గొప్పపరిశోధన సప్రమాణముగజరిగి అది పండితస్వీకృతి నంగవలెను- ఇటీవల దీక్షావారు సిద్ధీఖు గారు తమ లింగాయత్ అను ఉర్దూపుస్తకములో అరబ్బీఅక్షరములనుండి తెలుగున్నదల అక్షరములు పుట్టినవని చిత్రములతోసహా ప్రకటించినారు- పాపము ఈ యుభయభాషల ప్రాచీనలిపిలో ఓనమాలనుసైతము సిద్ధీఖు గారు చదువుకొనలేదు- మొన్న యొక డాక్టరుగారు శైవమతము మహమ్మదీయమునుండి పుట్టినదనెను. ఈమహానుభావుడు శైవమందలి ఒకగ్రంథమునైనను అవలోకించలేదు- శ్రీప్రాణనాథు గారు ఇట్టివారు కారు- వీరికి ప్రాచీనచరిత్రలో ప్రతిభగలదు- వీరియభిప్రాయమునకు విలువయుండవలయును- ప్రాచీనకాలపుశాసనములలో అరబ్బీభాషగాని అసీరియాభాషగానిదొరికినచో ఆశ్చర్యము కెందవలసినది లేదు- దీనికిని హిందూమహమ్మదీయ మతములకును ఏకత్వములేక ఆర్యత్వమును ప్రతిపాదించుట నిరాపదముకదుగదా! ఇతిహాసచర్చలటుంచి భారతదేశముయొక్క భవిష్యత్కల్యాణమును మాత్రమే దృష్టియందుంచుకొని "హిందువులు మహమ్మదీయులును "ఆర్యులే" యని ఘోషించుచో దీనినిగూర్చి నేనును మిక్కిలి సంతసింపగలను.













# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర భాద్రపద శు॥ 3

సోమవారము


## అష్ట దిగ్బంధనము

ఇంగ్లీషు ప్రధానామాత్యులగు చర్చిల్ గారున్ను అమెరికాసంయుక్తరాష్ట్రాల రాజ్యాధ్యక్షులైన రూజ్వెల్టుగారును రెండుమూడుదినాలు సముద్రములో ఒక యోడలో రహస్య సమాలోచనలుచేసి నతర్వాత ప్రపంచమునకు నూతన సందేశమును, నూతనాశయములను, ప్రసాదించిరి. అవి ఎనిమిదిసూత్రాలలో ఇమిడియున్నవి. వాటి ప్రధానోద్దేశము నాజీ ఫాసిస్టు భూతాలయొక్క అష్టదిగ్బంధనమైయున్నదనుట ఎక్కువ సమంజసముగా నుండును. తదనుబంధముగా ఈ ఎనిమిదిసూత్రాలు రాజకీయాలంకార శాస్త్రకారికావళికి లోబడినట్టివై నీతినిబోధించునవిగాకనబడుచున్నవి. పూర్వము ఏసుభగవానుడు ౧౦ సూత్రాలను సాయించియుండెను. ఏసుక్రీస్తు మతానుయాయులే యీ చర్చిలు రూజ్వెల్టుగారలు. మరియు హిట్లరు ముసోలినిగారలును ఏసుభగవానుని దివ్య మతానుయాయులే అని చెప్పబడుచున్నారు. అయితే ఏసుప్రభువుయొక్క ౧౦ సూత్రాలను పాశ్చాత్యరాజ్యాలేవియున్ను ఆచరించలేదు. ఏసునీతి ౧౯౪౧ ఏండ్లకంటె కొన్ని యేండ్ల పూర్వమునాటిముచ్చట. ఏసుభగవానుడు సిలువపై చంపబడిన ౧౯౦౦ ఏండ్ల తర్వాత అమెరికా అధ్యక్షుడుగానుండిన విల్సన్ ౧౪ సూత్రాలు—ఏసుకంటె విల్సన్ నాలుగాకులు ఎక్కువగాచదువుకొనియుండెనన్న మాట—ప్రపంచశాంతికిగాను ప్రసాదించిరి. ఆసమయములో కలియుగము మునిగిపోయి మరల కృతయుగము క్రీ. శ, ౧౯౧౮ తోనే ప్రారంభించుచున్నదని ప్రపంచజనులు— వారిలో ముఖ్యంగా దాస్యజనులు—భావించిరి. కాని ఆ ౧౪ సూత్రాలు అన్నియు తెగిపోయెను. మరల ప్రపంచములో పెద్దపెద్ద సామ్రాజ్య దేశాలు మరొకయుద్ధానికి సన్నద్ధలగుచునేయుండెను. నానారాష్ట్ర సమితి (లీగ్ ఆఫ్ నేషన్సు)ఏర్పాటయ్యెను. అది నామమాత్రమైనట్టిదె విశేషముగా స్వార్థపరులతో కూడినదైయుండెను. వివిధ రాజ్యాలవారు ఇకముందు యుద్ధముచేయకుండా ఉండవలెననికొందరు ప్రచారముచేసిరి. పెద్దపెద్దరాజ్యాలవారు ఆయుధాదుల యుద్ధపరికరాలనుసిద్ధము చేయకూడదని కెల్లాగుఅనువారు చాలారాజ్యాలవారిని ఒప్పించిరి. శాంతి దూతలు చాలామంది బయలుదేరి పెద్దపెద్ద గ్రంథాలువ్రాసిరి. తుదకు ఫలితం ఏమంటే ౧౯౩౯నాటియుద్ధం!

ఇక ఒకవారానికి యుద్ధముయొక్క మూడవసాంవత్సరికము ప్రారంభమగుచున్నది. చూస్తూ చూస్తూ ఉండగానే రెండేండ్లు గడచిపోయెను. ఈ యుద్ధము ఇంకా రెండేండ్లు జరుగుననికొందరు, నాలుగేండ్లనికొందరు, ఎవరికితోచినట్లుగా వారు జోస్యంచెప్పుచున్నారు. మళ్లీ విల్సన్ సూత్రాలవంటి సూత్రాలు ఇప్పుడు ప్రపంచానికి ప్రసాదితమైనవి. అవి "చర్చివెల్టు"సూత్రాలు. చర్చిల్ రూజ్వెల్టు మహాశయులు మూడుదినాలు బ్రహ్మాండముగా ఆలోచించి సమాధానపడి ప్రపంచానికి వెల్లడించిన అష్టసూత్రాలివి. ఏసుదేవుని ౧౦ సూత్రాలలో ౨సూత్రాలను, విల్సన్ప్రధాని ౧౪ సూత్రాలలోనుండి ఆరింటిని తీసుకొని ఈసూత్రాలను ఏర్పాటుచేసినారు. క్రీస్తు సూత్రాలు కొండపైన జన్మించినవి. (Sermon on the Monut) ఈసూత్రాలు సముద్రంపై జన్మించినవి (Sermon on the sea) ఇవి చాలా ముఖ్యమైనవి. అందుచేతనే చాలా సందిగ్ధముగానున్నవి! ఎట్లంటే

౧. అమెరికా ఇంగ్లాండు దేశాలు రాజ్యాలను సంపాదించుటకాని, ఇతరముల సంపాదించుటకాని కోరరు.

అంటే ఏమి? ఇప్పుడుండేవి వినా కొత్తవాటిని కోరరనియా? లేక ఇదివరలో సంపాదించిన దాస్యదేశాలను అట్లే ఉంచుకొందుము. అంతేకాని కొత్తవాటిపై చేయివేయమనియా? లేక ప్రాతవాటికి కూడా స్వాతంత్ర్యము నిత్తుమనియా? పాతవైన దాస్యదేశాలమాట స్పష్టంగా ఉండినట్లయితే రూజువెల్టురాజ్యాంగములో అధికారియైన రేయినాల్డ్సు అనేవారు "ఈసూత్రాలలోని నాలుగువిధాలైన స్వాతంత్ర్యములను ఇప్పుడే ఇండియాలోను రష్యాలోను ఎందుకుప్రారంభించరు." అని అన్నారు. దాని కింతవరకున్నూ జవాబెవ్వరున్నూ ఇవ్వలేదు.

౨. రెండవసూత్రమేమనగా. ఏదేశములోని జనులు ఏది స్వేచ్ఛతో కోరరో అట్టిదానిలో దేశసంబంధమైన మార్పును చేయరు.

అంటే ఏమి? జనులందరును ఏకవాక్యంగా ఒక విషయాన్ని కోరకపోతేయెట్లు? అట్టితావులలో మార్పులుండ నేరవనవలసిన దేనా?

3 మూడవసూత్రమేమనగా — ప్రతిదేశములోను జనులు తమకునచ్చిన పద్ధతిపై ప్రభుత్వాన్ని స్థాపించుకొనవచ్చును. ఏదేశాలస్వపరిపాలనం బలవంతంగా లాగుకొనబడినదో వాటికి మరల అదియిప్పింపబడునట

అంటే యేమి? ఇటీవల హిట్లరు బలవంతంగా గెలిచిన యూరోపుదేశాలకు మాత్రమే స్వాతంత్ర్య మిప్పింతుమని అర్థమా లేక 300 ఏండ్లనుండి యూరోపుదేశాలవారు ఏషియా దక్షిణ అమెరికా, ఆఫ్రికాఖండాలలో బలవంతముగా తీసుకొన్న దేశాలకు విముక్తి యిప్పింతురా?

౪. నాల్గవసూత్రమేమన— ప్రపంచములో అన్ని దేశాలకు అన్ని దేశాలలోనూ సమానమగు వ్యాపారహక్కులుండునట. అయితే ఇప్పుడుండే ప్రత్యేకహక్కులు (Obligations) అట్లేయుండునట. ఇదిన్నీ అస్పష్టంగానేఉన్నది.

౫. అయిదవసూత్రములో ఆర్థికాభివృద్ధి అన్ని దేశాలకు సమానముగా వర్తించునట్లు చేయుదురట. యుద్ధాలుజరుగుట నాలుగుఅయిదు సూత్రాలలోని విషయాలకే.

౬. జర్మను నాజీల ధ్వంసముచేసి ప్రపంచములో ఇక భయము, దరిద్రత, అనేవిలేకుండా చేయుదురట.

ఇదిన్నీ అస్పష్టమే. ప్రపంచములో భయమన్నది లేకపోవుట అసంభవము. దారిద్ర్య నిర్మూలనము ఎట్లగును?

౭. సముద్రంమీద అందరున్నూ నిరోధంలేకుండా ప్రయాణం చేయకలుగుదురట.

ఈవిధంగా చేయవచ్చును. కాని సముద్రంమీద ప్రయాణముచేసిన తర్వాత "మాదేశములోనికి మిమ్ము రానియ్యము" అని కనడావారు హిందూస్థానీలకు చెప్పినట్లుగా చెప్పితే దానికేమిప్రతీకారము? అసంత గొప్పవిషయముకాదులెండి. హిందూస్థానానికికూడా కనడావలె స్వాతంత్ర్యము దొరికితే కనడావారికిని ఆదేజవాబిస్తుంది. కాని హిందూస్థానానికంతటి అధికారము దొరుకుతుందా?

౮. అన్ని దేశాలున్ను హింసాపద్ధతిని వదలుకోవలెనట.

అర్థాద్భో మహాద్భో నమోనమః! అహింసా పరమోధర్మః!! ఇంకేముంది. ప్రపంచమంతా ఒక ఋష్యాశ్రమము అయిపోతుంది! అయితే ఇదిసంభవమా? సింహము గడ్డిమేస్తుందా? గరుడపక్షి ఆకులుతింటుందా? తోడేలు అలుము నములుతుందా? కోటానకోట్లు వ్యయము చేసి సిద్ధముచేసిన బాంబులు, తోపులు, తుపాకులు, తోటాలు, కత్తులు, విషాలు, ఇవన్నీ ఏమికావలెను. వాటిని ఇంతలో వచ్చు దీపావళి పండుగలో వినోదంగా అపాయంలేని ఉపాయంతో పటాకావలె కాల్చి వేయుదురా? హింసనుమనఃపూర్తిగా వదలుకొనివారి నేమిచేయవలెను. హిట్లరువలె దొంగతనముగా మరొకయుద్ధానికి మారణయంత్రాలను సిద్ధముచేసే నియంతలనేమిచేయవలెను. ఇతరరాజ్యాలవారు అట్టిదుర్మార్గరాజులను లేక నియంతలను లేక దేశాలను బలవంతముగా ఒప్పించవలసియుండును. అంతేకదా! లేకపోతే శ్రీరంగనీతులకేమి విలువయుంటుంది. బలవంతంగా ఒప్పించే దానికి ఆయుధసామగ్రి బలముకావలెను. అప్పుడు మరల మొదటిసితికేవచ్చుటగును. ఇక హింసానిర్మూలమగుటయెట్లు? "అమెరికాయున్న ఇంగ్లాండున్నూ ఆయుధాలను వదలుకొని నిరాయుధత్వానికి వచ్చిననాడు నేను నాహృదయపూర్వకమైన అభినందనాలను పంపుతాను" అని గాంధిగారన్నారు.

ఈ ఎనిమిదిసూత్రాలు ఒక యూరోపుఖండానికే కాదని రూజువెల్టుగారు సెలవిచ్చినారు. "ఏఖండములోని ఏచిన్న భాగాన్నికూడా చర్చించకుండా మేము ఉండలేము." అని రూజువెల్టుగారన్నారు. అలైతే ఎన్నోచిన్నచిన్న దేశాలవిషయమై మాట్లాడినవారు, హాలెండుకన్న ౧౦౦ అంతలు పెద్దదేశమైన హిందూస్థానాన్నిగురించి కూడా బాగా మాట్లాడియుందురు? మేజరు అట్లీగారు పార్లమెంటులో చర్చిల్ పరముగా పై అష్టవిధసూత్రాలను ప్రకటించిరి. మరునాడే కొందరు నీగ్రో (ఆఫ్రికావాసుల) ప్రతినిధులు వారినికలిసి "అయ్యా మేము కూడా మీ అష్టసూత్రాలలో చేరినట్లేనా? అనిఅడిగినారు."

"ఆదేమిమాట! తప్పకుండాచేరినారు తెల్లజాతులు నల్లకోలుజనులపై (races with darker skins) అన్యాయాలుచేసినది మాకుగుర్తున్నది." అనిచెప్పినారు. ఈ అట్లీమహాశయులే కొన్ని యేండ్ల క్రిందట హిందూస్థానానికి స్వరాజ్యమిస్తే ధనికవర్గాలు రాజ్యాన్ని వశపరచుకొని బీదలనంతా కష్టపెట్టుతారు కావున ఆ దేశానికి స్వరాజ్యం సరిపడదు అని ప్రకటించియుండిరి. మరిచర్చిలు ప్రధానిగారో హిందూస్థానానికి స్వరాజ్యమిస్తే బ్రిటిషు సామ్రాజ్యం ఎందుకును పనికిరానిదై యుంటుందని పూర్వంలోచాలా మారులుధారాళముగా ప్రకటించియుండిరి. అందుచేతనే సావర్కరుసరుగా రూజువెల్టుగారినే "మా హిందూస్థానానికే మిగతిపట్టింపనున్నారో తెలుపగలరా?" అనిమొన్ననే తంతీద్వారా విచారించినారు. వారికి జవాబుదొరకక పోవచ్చును. అమెరికా అధ్యక్షునికి హిందూమహాసభాధ్యక్షుని సవాలుకు జవాబిచ్చుటతప్ప మరివేరేవనిలేదా?

ఈ అష్టదిగ్బంధనసూత్రాలు ప్రధానంగా జర్మనీ ఇటలీవారిపై ప్రయోగింపబడినందున వారి అభిప్రాయాలు కనుగొనవలెను. జర్మనువారిట్లన్నారు "ఎన్నడో పుచ్చుపట్టి మాయమైపోయియుండినట్టి వర్సైలీసు సంధినాటి భాషనుండి కొన్నిపదాలను ఏరివాటిపై జనీవాపాతముద్రనేవేసి దానిపై బూజును తొలగించి మెరుగిచ్చినట్టిది యీసూత్రబంధము."

'Old long discarded stock from the moth chest of the vanished Versailles dialectic bearing the Geneva hall mark which has been hauled out and freshened up'

ఇటలీవారిట్లన్నారు.

"అంతాబాగుంది కాని ఆక్సిస్ (జర్మనీ ఇటలీ) రాజ్యాలేగెలిచేవిగా ఉన్న వనేసంగతి మాత్రం వారుమరిచి పోయినారు."

వీరిమాటలకేమిగాని రెండువిషయాలున్పష్టమైతే ఈ అష్టసూత్రాలు కలియుగంలో కృతయుగాన్ని తెచ్చిపెట్టినవనవచ్చును. అవేవనగా

౧. దాస్యదేశాలన్నియు వెంటనే స్వాతంత్ర్యము పొందవలెను.

౨. గాంధిగారి అహింసను అన్ని దేశాలున్నూ స్వీకరించవలెను.

ఇవిసంభవమా?

"వందో రాజా భవిష్యతి."

—

## 'త్రిలింగ' రజతోత్సవము

శ్రీవావిళ్ల వెంకటేశ్వర శాస్త్రిగారికి సన్మానము

మదరాసులో వావిళ్లవారి ముద్రణాలయము నుగురించియు వారుప్రచురించినగ్రంథములగురించియు తెలియనిఆంధ్రులు ఆంధ్రులుచాల తక్కువ ఈముద్రణాలయముస్థాపించి నూరేండ్లు అయినది. అస్థాపకుల కుమారుడగు శ్రీవావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారు ఇప్పుడు 'త్రిలింగ' అను తెలుగుపత్రికను, "ఫెడరేటెడ్ ఇండియా" అను ఇంగ్లీషుపత్రికను నడుపుచున్నారు. శ్రీ వెంకటేశ్వరశాస్త్రిగారు అనేక సంస్కృతాంధ్ర ప్రాచీనగ్రంథములనన్నింటిని పండితులచే వ్రాతప్రతులనుండి శోధింపజేసిముద్రించి, ప్రాచీనగ్రంథములు ఆంధ్రులకునష్టముకాకుండ పనిచేసినారు.

వారి "త్రిలింగ" పత్రికకు రజతోత్సవముఆగష్టు ౧౭వతేదిన సాయంత్రము నెల్లూరులో గోఖలేహాలులో జరుపబడెను. కొనుడు..... కేల్కరుగారు అధ్యక్షతవహి... గారికి ... రజతపేటికలో ... సంపుటము సమర్పించబడెను. కంచికామకోటిపీఠాధిపతి జగద్గురుశంకరాచార్యులవారితరఫున ఒక శాలువసమర్పించబడెను. మదరాసుకార్పొరేషను మేయరు శ్రీగోపతి జానకిరామచెట్టిగారు త్రిలింగరజతోత్సవ సంపుటముతరఫున సన్మానపత్రమును సమర్పించిరి. చెన్నపురి ఆంధ్రవంతీరమండలి నతర్ఫాన, హిందూమహాసభతర్ఫాన, చెన్నపురి ఆంధ్రమహాసభాసభ్యులతర్ఫాన సన్మానపత్రి అర్పితములైనవి.

కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రి శర్మగారు ఎన్.సి. కేల్కరుగారు, పిఠాపురం మహారాజాగారు, శేషా రామేశంపంతులుగారు, అల్లాడి కృష్ణస్వామయ్యగారు శాస్త్రిగారిముద్రణలవల్ల పత్రికలవల్లకలిగిన విజ్ఞానలాభమును కొనియాడిరి.

కేల్కరుగారు ఉపన్యసించుచు రామస్వామి శాస్త్రిగారు శ్రీబాలగంగాధరతిలక్ గారి భక్తులని ... చెప్పుచుండినసరియైనప్పా అనికూడ విచారించి ... వారిమాటవేదవాక్యముగ పరిగణించు బృందానికి చేరినవారని తమవిశ్వాసమనియు, మదరాసులోని వావిళ్లముద్రణాలయములో పోల్చదగినది తన బొంబాయిలో నిర్ణయసాగర ముద్రణాలయమొకటియేననియు, శాస్త్రిగారి సంపాదకత్వమున నడచుచున్న ఇంగ్లీషుపత్రిక ఆశయములు విశేషచతో కూడినవనియు చెప్పిరి.

శాస్త్రిగారు అన్నిప్రశంసలకును కృతజ్ఞతచెల్లి హిందూమతసంస్కారము లకును, ఇతరభారతీయమతసంస్కారములకును సంబంధించినట్టి గ్రంథములనేకములు ఇంకనుఅచ్చుపడక మిగిలియున్నవనియు, ఇప్పటికంటెఎక్కువ ప్రోత్సాహమున్నచో వాటినిముద్రింపదలచితిననియుచెప్పిరి. మరియు స్వతంత్రగ్రంథాలకేగాక ఇతరభాషలలోని విజ్ఞానవిధులను గ్రంథాల భాషాంతరీకరణములనుకూడ ప్రచురింపదలచితిమనిరి.

మంగళముతో సభముగిసినతర్వాత అందరును విందారగించి వెళ్లిపోయిరి.

—

## పాకిస్థాన సిద్ధాంతము బ్రిటిషువారి సృష్టి

పాకిస్థానసిద్ధాంతము నిజంలో ౧౦ఏండ్లక్రింద రెండవగుండ్రబల్లసభతర్వాత మూడవగుండ్రబల్లసభకుపూర్వము బ్రిటిషుపార్లమెంటులో కన్సర్వేటివుపార్టీయందు భారతదేశస్వాతంత్ర్యమునకు ఇష్టములేనికొందరు సభ్యులసృష్టియని ఇప్పుడుబయటపడుచున్నట్లు మదరాసునందలి "హిందూ" పత్రికయొక్క సీమ్లావిలేఖరి ఆగష్టు ౧౯వతారీకునాటిసందేశములో తెల్పుచున్నారు. అప్పటికి జిన్నాగారింకను పాకిస్థానపక్షములో చేరియుండలేదు. అప్పుడుబ్రిటిషుప్రభుత్వమునందు పార్లమెంటులోని మూడుపార్టీల ప్రతినిధులు సైమన్ కమిషన్ సభ్యులు రామ్సే మెక్డొనాల్డుగారి ప్రధానిత్వమునందు కూడియుండిరి. ఈప్రభుత్వమువారు భారతదేశానికొక్రొత్తగానైనను రాజ్యాంగసంస్కరణములను, ప్రసాదించు ప్రయత్నములోనుండిరి. అప్పుడుచర్చిల్, సర్ హెన్రీ పేజ్ క్రాఫ్ట్, సర్ మైకేల్ ఓడయర్ అను కన్సర్వేటివుపార్టీలోని తీవ్రపక్షమువారలు పార్లమెంటులోను, బ్రిటనులోను అప్పటిజాతీయప్రభుత్వము భారతదేశవిషయంలో అవలంబించుచుండిన విధానముపట్ల ప్రాతికూల్యమును వృద్ధిచేయుచుండిరి. ఆరోజులలో కన్సర్వేటివుపార్టీలోని భారతదేశరాజ్యాంగసంస్కరణ ప్రతికూలురగు సభ్యులలో సన్నిహితసంబంధముగల కొందరుకలిసి ఒకరహస్యశాఖనుసృష్టిచేసి, జాతీయతయనుభారతదేశమందు అన్నిపోట్లకుకలిసి కొత్తమతంగానుండి ముసల్మానులకుపంపిరి. అనాసల్మానులలో కొందరుప్రభుత్వాధికారులు కూడనైయుండిరి. అనుసల్మానులు అచ్చటలోనిపాకిస్థాన పద్ధతిని ముసల్మానులకుఅందరికిని ఇష్టమగునట్టుచేయుటకొరకు బడిరి. అప్పుడుపంజాబురాష్ట్రమును సరిహద్దు రాష్ట్రమును, కాశ్మీరుసంస్థానమును, సరిహద్దురాష్ట్రానికిఉత్తరంలో కొండజాతులుండేప్రదేశమును, సింధురాష్ట్రమును భారతదేశమునుండి చీలదీయవలెనని సంకల్పించియుండిరి.

అప్పుడుఅట్టిలేఖనొకదాని పొందికట్టిఒకముసల్మానునివల్ల ఇప్పుడుఆలేఖలోనివిషయ్యసమాచారములు తెలిసినవి. భారతదేశమునకు హిందూముస్లిము ప్రత్యేకపంక్తిపృథక్కైన, సరిహద్దని మొగలాయీచక్రవర్తులుఅలచియుండుట విశేషయుక్తమైనదని ఆలేఖలో చెప్పబడినది. పాకిస్థాన విధానమునకూడ ఆదేవిర్పాటును ఒప్పుకొనవలెనని సూచింపబడినది. బర్మా భారతదేశంనుండి వేరుచేయబడినున్నదని తెలిపినతర్వాత ఆరహస్యలేఖలో పాకిస్థాన విధానమునకు కన్సర్వేటివుపార్టీలోని ఎక్కువమంది కుబడిగలసభ్యులు అనుకూలురుగానున్నారుగనుక, అదితప్పకవిజయవంతము కాగలదని తెలుపబడినది.

—

## ఆంధ్రులు-బహిరంగలేఖ

—చిలుకూరు ఆంధ్రమహాసభ జరిగినతర్వాత, జరిగిన చర్చలన్నిటినిగమనించిచాలామందిపత్రికలలో వ్రాతల్లో సెనరిపోయిందా ఏమైనా ఆచరణరూపంగా చేద్దామా, అనిఅడుగుతున్నారు. అవిధంగా ప్రశ్నించేవారు మూడువిధాలయిన సూచనలు చేస్తున్నారు. ఆంధ్రమహాసభలు యేదొక సంస్థను శేరదీయాలనేదొకటి, తెలంగాణామహాసభలనే పేరుతో! ఇంకొకసభ పెట్టాలనేది రెండవది ఆంధ్రమహాసభలో నేఉండి మనఉద్దేశాలను సాధించాలనేది మూడవది.

నాఉద్దేశ్యమే కాకుండా, చాలమందిపెద్దల ఉద్దేశ్యంకూడామార్గమే అనుసరణీయమని నావల్ల తెలిపిఅంగీకరించదగినట్లు చెప్పతగునదు, మన ఆశయాలను ప్రజలు తెలుసుకోగలుగుతారు. మొదటి రెండుసూచనలు తనుచేదడము. ఎదుటివాళ్లని శిరచటంకంటిది.

మొన్నటి ఆంధ్రమహాసభ కార్యకర్తల సమావేశమప్పుడు హైదరాబాదు విచ్చేసిన కొందరు మిత్రులుసమావేశ మైసాధ్యాసాధ్యాలు బాగోగులు విచారించినతర్వాత, ఈనిర్ణయాలు చేశారు.

౧—అభివృద్ధిపక్షాన్ని తిరిగీవడిపించటం.

౨—పక్షసభ్యులుగా ప్రజాసామాన్యంతో చేర్పకుండా, ఆంధ్రమహాసభద్వారా కాకుండా ఇతరవిధాలకూడా చేశాని, జాతి, సేవచేస్తున్నవారుమాత్రమే ఇందు సభ్యులుగావుండేటట్టు యమంఏర్పరచటం

౩—అట్టిసభ్యులకు సభ్యత్వరుసుమేమీ విధించకుండావుండటం—

పైవిషయాలు ప్రజలకువిధముగా నమ్మకమో, తెలుసుకుంటేతప్ప ఇతరకార్యక్రమం ఏర్పరచటంబాగుండదు. కొబట్టి ఈవిషయాలు తమఅభిప్రాయాలను గూర్చిప్రకటించి ప్రజాభిప్రాయం తెలుసుకోవటానికి ఏలుగలుగచేయు ప్రార్థన.

పైనిర్ణయాలవల్ల పక్షంలోప్రతివారు సభ్యులుగాఉండటానికివీలుండదు. కేవలము ఆంధ్రమహాసభద్వారానే దేశానికిసాటుబడేవారుకూడా సభ్యులుగాచేరలేరు. విద్యాలయాలు గ్రంథాలయాలు హరిజనసేవ ఖాదీప్రచారసంస్థలు, రైతుసంఘాలు, వర్తకసంఘాలు మొదలయిన సంస్థలద్వారా దేశోన్నత్యానికిపాటుబడేవారుమాత్రం పక్షసభ్యులు కాగలుగుతారు ప్రతిసంస్థతరఫున ప్రతినిధులుండాలని అపోహపడకూడదు. అసంస్థలకార్యకర్తలు, వారిపదవేదైనాసరే, సభ్యులుగాచేరవచ్చును. దీనివల్ల నిరాడంబరముగా కార్యక్రమం సాగిపోతుంది. శుద్ధిగా ప్రజలతో సభ్యత్వ పత్రములపైసంతకములు చేయించేపద్ధతిపోతుంది—పక్షంచిన్నదిగావున్నా కట్టుబాటు గావుండటానికి వీలవుతుంది పక్షసభ్యులు కొద్దిగావున్నా కలు

## శ్రీ॥శే॥ డాక్టర్ రవీంద్రనాథ టాగూరు గారు

బరారు యువరాజ దంపతుల ప్రశంస

హైదరాబాదు-దక్కనునగరమందు ఆగస్టు ౧౫వ తేదిన జమరుద్ మహలుభవనంలో శ్రీ॥శే॥ రవీంద్రనాథటాగూరు గారికై విషాదము తెలియచ్చుటకు జరిపినసభకు శ్రీ.వ. బరారుయువరాజాగారును, వారిసతీమణియు సందేశములనంపిరి— అవిసభలో చదువబడెను—

యువరాజాగారి సందేశమిట్లున్నది. "ఎవరిమరణము ప్రజాహితసేవకుతీరనినష్టమగుచున్నదో ఆట్టిభారతీయమహాపురుషుని స్మరణలో హైద్రాబాదుకూడచేరి ప్రశంసనొసగుటయుక్తమైనదే. రవీంద్రనాథటాగూరుగారి దర్శనీయమగుశరీరము, వారిగంభీరవిశ్వాసములు, వారివిశాలవ్యాప్తిగలదయ, వారిమానవసేవాసక్తి— ఈగుణములు వారినికలిసి మాట్లాడుఅదృష్టముకలిగిన ప్రతివానిమనస్సునకు అవి స్మరణీయములుగ నాటుకొనినవి, వారిప్రతిభనుండి ప్రవహించినమాధుర్యసవంతి మధురాలాపములలో ప్రవహించినది, వారికవితాస్వరములు ఆత్మరప్రపంచమునకు ఆనందముకూర్చ ప్రసిద్ధినొసగినవి. వారుభారతదేశమునకు దేశసముదాయమునందు గౌరవమునొసగినారు."

యువరాణీగారి సందేశమిట్లున్నది. "భారతదేశపుగొప్పపుత్రుడును, తత్వవేత్తయు, పదమాధుర్యశాలియునగు వారిని జ్ఞాపకముంచుకొనుటకు వారుమానవులను ఏఆదర్శములను అనుసరిమటకైకోరెనో ఆఆదర్శములనుఅనుసరించుటయే కర్తవ్యము— వారికవితామాధురీరచనలు మనమునదేశమునకుసహాయపడుటలోను, సేవచేయుటలోను కడపటిలక్ష్యమును సాధించుటకైపోవుమార్గమున సర్వదా దీప్తినిచ్చుచుండగలవు."

---

## కాంగ్రెసు స్థితినిగూర్చి సర్దారు పటేలుగారి ప్రకటన

సర్దారువల్లభాయిపటేలు గారు ఆగస్టు ౨౦వ తేది సాయంకాలము ఎఱ్ఱవాడ జెయిలునుండి విడుదలచేయబడి అర్ధరాత్రిబొంబాయికిచేరిరి—వారికి గారికుమారుడు దయాల్ భాయ్ పటేలు గారును, కుమార్తె మణిబేను పటేలుగారు బొంబాయిరాష్ట్రీయకాంగ్రెసు సంఘాధ్యక్షుడును, ఇతర మిత్రులును దాదర్ స్టేషనువద్ద స్వాగతమిచ్చి వారింటికి తోడ్కొనిపోయిరి. తర్వాతకొద్దిసేపటికి వారియింటి డాక్టరున్ను, మరియిద్దరుడాక్టరులును వారినిపరీక్షించిరి—వారిని ౨౧వ తేది మళ్లీపరీక్షించినతర్వాత, వారు ఒకచికిత్సాలయంలో అపరేషను కైపోగలరు—పోయినరెండుమాసాలలో పటేలుగారు పండ్లరసముమీదనుంటుండిరి— ఆగస్టు ౨౨వ తేదిన అపరేషను జరుగగలదు

సర్దారుపటేలుగారు ఈక్రిందిప్రకటన చేసినారు:

ఆరోగ్యముకొఱకై విముదల పొందుట నాకు సంతోషముకాదు—సత్యాగ్రహికి ఉండవలసిన ముఖ్యలక్షణములలో దృఢగాత్రము ఒకటి—అదినాకు లేకుండాపోదని నేనాశపడి యుంటిని—జెయిలులో నాఆరోగ్యమువిషయమై నేను చాల జాగ్రత్తగానుంటిని—మాలత్యముసిద్ధించువరకు నేను ఎంతకాలమైనను విశ్రాంతిపొందు నుండవచ్చునని తలించితిని—కాని అకస్మాత్తుగా నా ప్రేగులు సరిగా పనిచేయుట మానివేసెను—అనేకవారములుగా నేను పాలుబండ్ల ఆహారముతోనుంటిని— డాక్టర్ బిల్లర్ గారు పాలిపస్ ఉన్నదని అనుమానించి, సరిగాపరీక్షించనిది ఎట్టిచికిత్స గానికుదరదని తెలిపిరి—అందుకై వైద్యపరీక్ష అవసరమయ్యెను— ప్రభుత్వమువారు నన్ను సాసూను అస్పత్రికి తీసికొనిపోయి దయజూపిరి— అక్కడి సివిల్ సర్జను గారు వెంటనే తమనివేదికను ప్రభుత్వమువారికి పంపించిరి.

నేను సంతోషముతో ప్రైవేటు ఆస్పత్రిలో ఆపరేషను చేయించుకొని, అది పూర్తిఅయి నేను బాగైనవెంటనే తిరిగిఎఱ్ఱవాడజెయిలుకోని నాగదికినేను పోయియుండవలసినది—కాని అట్లుకానీయలేదు—అందువల్ల ఇప్పటికిని అక్కడనుండే నామిత్రులను వదలవలసివచ్చుట నాకుచాల కష్టముగానున్నది—భగవల్లీలు అగోచరములు— ఎవరుగాని వానినిర్ణయమునకులోంగకతప్పదు—జెయిలులోను అస్పత్రిలోను నన్ను నాజబ్బుకాలమందల్లపుడును జాగ్రత్తతోను, శ్రద్ధతోను ఆదరించిన

## స్విస్సుజాతిస్త్రీ సత్యాగ్రహము

స్విజ్జర్లాండు దేశప్రధానవగరమగు జూరిచ్ నుండివచ్చిన సోలింగర్ కన్య ఆగస్టు ౨౦వ తేదిసాయంత్రము మదరాసునగరములో హైకోర్టుమందు యుద్ధప్రతికూలశేకలుచేసి సత్యాగ్రహముచేయను— వెంటనే ఆమెను అరెస్టుచేసిరి— మరునాడు మదరాసుప్రధాన రాజధాని మేజిస్ట్రేటు ఆమెకు భారతదేశరక్షణ నియమాలక్రింద ౬ నెలల సాధారణశిక్షవిధించి, "ఏ" తరగతిఖైదుగా వుంచినొసగిరి— న్యాయాధికారి ఆమెనుభారతదేశంలో ఏమిచేయుచున్నారని అడుగగా ఆమె "ఏంతేను ఊరికేఉన్నాను" అనిచెప్పెను— ఈమె ఇదివరకొకసారి బెజవాడలో ఇట్లే సత్యాగ్రహముచేసి శిక్షపొందియుండెను.

---

(—శేషం)

ఆందరికిని వాక్స్వతంత్ర్య కొఱవడనము లభించవలెనియున్నది.

రాజకీయస్థితినిగురించి నేనింతకంటె ఏమియు ఎక్కువచెప్పజాలను—నేను జెయిలులో వార్తాపత్రికలను జాగ్రత్తగాచదువుచుంటిని—కాంగ్రెసు గైకొన్న చర్యసరియైనదే— దానిని మార్చుటకెట్టి కారణములేదని నానమ్మకము—జెయిలులోను, వెలుపలను కాంగ్రెసువాలు తమవ్యవహారములను నడుపుచున్న వానిశేకమందును నాయకత్వమునందును గట్టివిశ్వాసముగలిగియున్నమను సంతృప్తిగలిగియున్నారు. అనాయకుడు పొరపాటు చేయకుండ మనలను మనలక్ష్యమునకుచేర్చగలడని విశ్వసించవచ్చును—కాని ఇపుడు రాజకీయములను చర్చించజాలను—ఎందుకనగా భగవంతుని దయవల్లనో ముందుఆరోగ్యం బాగుచేసికొని తర్వాత గాంధిమహాత్ముని ఆజ్ఞప్రకారము చేసెదను."

## రూజ్వెల్టుకు సావర్కరు తంతి

అఖిలభారత హిందూ మహాసభాధ్యక్షుడగు వి-డి-సావర్కరు అమెరికాఅధ్యక్షుడగురూజ్వెల్టుగారికిపంపినతంతి ఈక్రిందివిధముగా నున్నది:—

"ఇంగ్లాండు, అమెరికాలుకలసి ప్రకటించిన యుద్ధాశయములు ఇండియాకుకూడ వర్తించునా, ఈయుద్ధమునుగిసినతర్వాతఒకసంవత్సరములోగ భారతదేశానికి సంపూర్ణస్వాతంత్ర్య మొసగబడునని అమెరికాగ్యారంటీయివ్వగలదా స్పష్టముగా చెప్పవలసినదని అఖిలభారతదేశపు హిందూమహాసభఅధ్యక్షునిగా కోరుతున్నారు— అమెరికా అట్లాచేయునిచో, ఇండియా అప్రకటనమునిదివరలో ఇంగ్లాండుజర్మనీలకుజరిగిన యుద్ధముయొక్క ఆశయములతోపాటు ఎప్పటిదియు కాగలదనిఎంచగలదు. సామ్రాజ్యాలంటేవారలు అవిలేనివారలకై తమసామ్రాజ్యాకాంక్షను ప్రయోగించుటకిది ఒకసాకుఅనిఎంచగలదు."

---

## రైట్ ఆనరబుల్ సర్ అక్బరు హైదరిగారు

రైట్ ఆ. సర్ అక్బర్ హైదరిగారికి వీడ్కోలొసంగుసందర్భములో మ. ఘ. న. నిజాంప్రభుత్వాధికారులు ౧౯౪౧ఆగస్టు౨౪వ తేది ఆదివారము సాయంకాలము ౪॥గం॥లకు బాగేఆంలో "ఆట్ హోం" ఏర్పాటుచేయుచున్నారు—

సర్ అక్బర్ గారు మరునాడు రెడ్డిహాస్టలువద్దగల హైదరాబాదు స్త్రీప్రతినిధుల సంఘముయొక్క క్లబ్బుకు ప్రారంభోత్సవము సాయంకాలము ౬గంటలకు జరిపెదరు— అప్పుడుకూడ ఒక "ఆట్ హోం" జరుగును.

---





[illegible] సంవత్సరము చందా [illegible] ... విల ప్రత్యేకము

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

The only [illegible] Paper [illegible] ... Best Medium for Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Volume 16 | Hyderabad-Dn | Monday 25th August 1941 | Number 33


## భారతదేశోద్యమానికి విజయము

### మహాత్మునికిస్పష్టముగా కనిపించుచున్నది

భారతజాతీయ కాంగ్రెసు మహాసభయొక్క ప్రధానకార్యదర్శి యగు జె- బి- కృపలాని గారు అగస్టు ౨౦వ తేది సాయంకాలము నయానగరం లో హాలెట్ టౌనుహాలులో ఉపన్యసించుచు ఇటుచెప్పిరి: "కేవలమ్ జాతీయ మహాసభ కై నయానగరానికివచ్చుచు నేనేమిచెప్పవలెనని గాంధిమహాత్ముని అడిగితిని- వారు కొంతసేపు ఊరకుండి, మనము దేనికై ప్రయత్నించుచున్నామో దానిజయము మహాత్మునికి స్పష్టముగా కనిపించుచున్నట్లు చెప్పవలసినదని నాకుచెప్పిరి- ప్రపంచమునయొక్క రోగములన్నిటికిని అహింసా సత్యములు మందుసత్యాగ్రహము అనుకొన్న ప్రకారము జరిగిపోవుచున్నది."

## జిన్నాగారిని సమాధానపరచుటకు అమెరీగారిప్రకటన

భారతదేశమునయొక్క సెక్రెటరీఆఫ్ స్టేట్ అగు అమెరీగారు ఈక్రిందిప్రకటనను అగస్టు ౧౯ వ తేదిన గావించినారు:

"రాజ్యాంగమునయొక్క అమలుఏ వీరాష్ట్రిఅలో నిర్విఘ్నముగాసాగుచున్నదో ఆయారాష్ట్రముల ప్రధానమంత్రులకు వారి సొంతహోదాలో గాని పార్టీసంబంధముతోగాని నిమిత్తములేకుండ, ప్రధానమంత్రిహోదాలోనే జాతీయరక్షణ సంఘములో చేరుటకై వైస్రాయి గారు ఆహ్వానించినారు. వారు ప్రధానమంత్రులహోదాలో ఆహ్వానితులగుటయేగాక, ఆహోదాలోనే వారి రాజ్యాంగసంబంధమైన బాధ్యతను, మొత్తముమీద ప్రజలకును, రాష్ట్రములకును, వారుచేయవలసినవిధిని దృష్టిలోనుంచుకొని, ఆ ఆహ్వానములను అంగీకరించినారు"

## జన్మాష్టమి

(ఓ. వి) బొంబాయి, ౧౭-౮-౪౧

ది ౧౫-౮-౪౧ శుక్రవారం ౯/౩౦ గంటల నుండి ౧౨ గంటలవరకు బొంబాయిలో లోవర్ పరేల్ శేషాద్రిత్రిపతిఅర్య జక్కు౦నరసయ్య, డీ కొండవిఠల్ గార్ల కలిసి గొప్పయజ్ఞము శ్రీ డీ- వి-డిస్వామినిజామాబాద్ గారితో చేయించిరి. త ర్వాత రామానుజం గారి అధ్యక్షతలో సభజరిగెను. సభలో, డి-వి-స్వామిగారు, ఉద్దరామయ్యగారు, కొడభూమయ్య వైద్యగారు యింకా కొందరు ఉపన్యసించిరి. సుమారు ౫౦౦మంది పాల్గొనిరి. కృష్ణునిఆదర్శచరిత్రను వివరించుటతో ఓడ నుద్యమాంపములు వదలి వైదికధర్మమును స్వీకరించినట్లు వెల్లడిచేసిరి. బొంబాయిలో ఆర్యసమాజమువారు తెలుగులో ప్రచారము చేసినట్లయితే బహుశ్వరగా ఆర్యులుకాగలరు ఆర్యప్రతినిధి సభ (హైదరాబాదు స్టేట్) వారుఇటు ధ్యానముంచగలరు

## చర్ఖా మోటుకాలమువి

### సర్ యాకూబుగారివిమర్శ!

హైదరాబాదు, మెహరు ౧౪

నిజాంకాలేజిలోమాట్లాడుచు హైద్రాబాదు రీఫారంసలహాదారుగా నియుక్తులైన సర్ మహమ్మదు యాకూబు గారు ఇట్లుసెలవిచ్చిరి-

రాజరికమునుగురించిన పాశ్చాత్యభావాలు మనప్రాచీనాదర్శాలకిసరిపోవు. పశ్చిమ నాగరికతయొక్క ఫలితాన్ని మనమేమామున్నందులకు మనము అదృష్టవంతులము ప్రపంచము సృష్టిచరాను, గోచిబట్టనుస్వీకరించి తెనక్కు నడుచుటను సేసుకోరను- అట్లుచేయుటచేత మనము అటవికయుగానికి (Primitive age) పోగలము పాతసారాయిని క్రొత్తసీసాలలో పోసినట్లుగా మనముండవలెను. మానవత్వములో ఉత్తమమార్గ మును కలిగియున్న ప్రభువు తమకు లభించినందులకు హైద్రాబాదు రాజ్యయువకులు అదృష్టవంతులైయున్నారు-

### అశ్రుతర్పణ

హైదరాబాదునగరములో ఆంధ్రయువతీమండలివారు ౨౧గురువారం నాడు శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయమందిరంలో స్వర్గీయ రవీంద్రకవిచంద్రుని మరణానికి సంతాపసభ జరిపినారు-

శ్రీమతి టీవరలక్ష్మమ్మ గారు తమఅధ్యక్షభాషణములో రవీంద్రుడుగొప్పకవియేగాక దేశభక్తుడు ఆత్మగౌరవపరుడు వేదాంతికూడానైవున్నాడని చెప్పినారు- తరువాత శ్రీ సత్యవతి, ఆండాళ్లు గార్లు వారిజీవితవిశేషములనుగురించి ఉపన్యసించారు. సీతాకుమారి, వి-వసంతకుమారి గార్లు రవీంద్రునిరచనలలోని విశిష్టతనుగురించిమాట్లాడారు. శ్రీ రంగమ్మగారు చివరకుమాట్లాడుతూ ప్రపంచమంతాకూడా వారిమరణానికివిచారించుచున్నదనీ వారిమరణంవల్ల భారతదేశానికేగాక ప్రపంచానికంతా తీరనినష్టంకలిగిందనీచెప్పి వారి తెనుగు రచనలనుమండలికి ఉచితంగాఇస్తామని వాగ్దానంచేసిరి.

## యస్-వి- జగన్నాథంగారి నిర్యాణము

సికింద్రాబాదువాస్తవ్యులును పాపులర్ కెమిస్టుకంపెనీ అధికారులునుఅయిన వైవారు గతఆదివారమునాడు సికింద్రాబాదుహాస్పటలులో మరణించిరి- వారుచాలాఉత్తము ౦- ఖద్దరుకొరకై చాలాకాంట్రాక్టు పోగొట్టుకొని నష్టపడిరి- కాంగ్రెసుకు మంచిసహాయముచేసినవారు హైదరాబాదు సత్యాగ్రహకాలములో పోలీసువారి ద్వారా వారికిహెచ్చరిక చేసియుండిరట-

### శ్రీవిష్ణుబాలసేనాగణేశ మహోత్సవము

హైదరాబాదు (దక్కను)

ఈ గణపతిమహోత్సవము వైనగరంలో సుల్తానుబజారువందు చమన్లాల్ బాగులోఅగస్టు ౨౬ మంగళవారంనుండి ౩౦వతేదీ శనివారంవరకు జరుగగలదు ప్రతిరోజుఉదయం ౭గం.నుండి ౯గం.ల వరకును, రాత్రి౭గం మొదలు ౯వరకు పూజాదుల జరుగును ప్రతిరోజుసాయంకాలం ౫గం లనుండి రాత్రి౧౦లేక ౧౨గం.ల వరకు సంగీతము హరికథమున్నగు కార్యక్రమాలు గలవు,

మొదటిపేజి తరువాయి

యులుగాపోవుచున్నారు, అగస్టు ౨౦ వతేదివాటిరాత్రి చీనామీదుగా పోవుచున్న హాయ టెనిన్గ్రాడునగరమునకు ౧౨ మైళ్ల దూరంలోమాత్రమేఉండినట్లు స్వీడనుదేశపు పత్రికలలో వార్త వెల్లడియైనది. లెనిన్గ్రాడుకు నైఋతిదిశలో ౩౦ మైళ్ళదూరంలో లూగానదిప డమటిగట్టుపైనుండు కింగ్సిప్ అనుపట్టణమును తమసేనలు ఖాళీచేయవలసివచ్చినట్లు రష్యావారు అగస్టు ౧౯ వతేది అర్థరాత్రిప్రకటించినారు-అగస్టు ౨౧ వతేదినాటికి ఇల్మెన్ సరస్సుకును,పీపస్ సరస్సుకునుమధ్య రష్యనుసేనలచే రక్షితమైన దుర్గప్రదేశమును జర్మనుసేనలుభేదించి లెనిన్గ్రాడుకు ౧౦౦ మైళ్ళదక్షిణములోనుండునొవోగ్రాడును, ఎస్టోనియాసరిహద్దువంను, లెనిన్గ్రాడుకు పడమటగానుండు నార్వాను, నార్వాకు ౧౪ మైళ్ళ తూర్పుననుండే కింగ్సెప్పును ఆక్రమించినవి- ఇపుడు లెనిన్గ్రాడును పట్టుదలతో రక్షించుటకై అక్కడిసేనలఅధిపతి ప్రజలకు విజ్ఞప్తిచేసినాడు-

లెనిన్గ్రాడుకు వాయవ్యదిశయందు అడోగా సరస్సునగట్టువద్ద ఫిన్నిషుసేనలు పోరాడుచుండ రష్యాసేనలుసోర్టావాలావద్దనుంచి దానినిరక్షించుటకై పోరాడుచున్నవి-

మధ్యరంగమందు స్మోలెన్స్కుకును కీవునగరానికిమధ్య గోమెల్ వద్ద అగస్టు ౧౯వ తేదినుండి పోరాటము జరిగినతర్వాత రష్యావారి సేనలు అగస్టు ౨౧వ తేదినాడు ఆ పట్టణమును ఖాళీచేసి వెనుకకుపోయెను.

ఇకదక్షిణరంగమందు నీపర్ నదికి పడమట యుక్రెయినుఅంతయు జర్మనులవశమైనట్లుచెప్పుచున్నారు రష్యనులు ఈమాటనుకాదనుటలేదు ఈయుక్రెయినురంగంలో జర్మను సైనికులు ౧౫ లక్షలను ది యున్నారు-జర్మనులు యుక్రెయిను ప్రాంతమునుఖాళీచేసి వెనుకకుపోవుచుండిన రష్యాసేనలను తరిమితరిమికొట్టిరట. ఓడలలోకొన్ని రష్యాసేనలుపోవుచుండగా అవిఅమాంతంగా ముంచివేయబడినవని జర్మనులుచెప్పుచున్నారు. ఇపుడుజర్మనులు నీపర్ పెట్రోవుస్కు పట్టణమును పట్టుకొనయత్నించుచున్నారు. ఈపట్టణంలోగొప్పపరిశ్రమలును, ప్రపంచంలోకంతటికిని గొప్పదగు హైడ్రోయలెక్ట్రిక్ యంత్రమున్ను గలవు- తర్వాత ఒడెస్సారేవుపై జర్మనుసేనలు పడినవి- దానినిపోకుండ కాపాడుకొనుటకై రష్యావారిసేనలు తీవ్రముగాపోరాడుచున్నవి- ఒడెస్సాతూర్పున నూరుమైళ్లదూరంలో నీపర్ నదీముఖద్వారమున్న ఖెర్సన్ అనురేవుపట్టణము జర్మనుచేజిక్కినది- అగస్టు ౨౧వ తేది నాటి జర్మనులప్రకటనలో రష్యాసేనలు ఒడెస్సానుండియు ఓస్టభోవునుండియు పారిపోవుచుండ జర్మనుసేన తరిమితరిమి కొట్టినట్లు చెప్పబడినది-

రష్యావారి మాస్కో నగరంమీదికిపోయి బాంబులువేయుటకు అనేకజర్మనువిమానాలు యత్నించుచున్నవి గాని, ఏరోజుగాని ఒకటో రెండో (లేక అపలేకపోవ్యమో) విమానాలుమాత్రమే పోగలుగుచున్నవని రష్యావారలనుచున్నారు అగస్టు౧౯,౨౦తేదులలో రాత్రులందు రష్యావారి విమానాలు జర్మనీవారి ఓడ్లిమునగరంపై బాంబులువేసినట్లు రష్యావారు తెల్పినారు-

## రవీంద్రునినిర్యాణముచే చైనాఅధిపతి శోకము

శాంతినికేతనములో ఒకప్రొఫెసరుఅగుటాన్ యున్ షాన్ గారిపేర చైనానియంతయగు చియాన్ గై షేక్ గారినుండి అగస్టు౧౧వతేదిగల ఒకసందేశము చేరినది అదిఇట్లున్నది, "డాక్టర్ రవీంద్రనాథ్ టాగూరిగారి మరణము చైనాకుచాలా దుఃఖముగానున్నది. అపూర్వదర్శి ఇక దొరకడు గదా వారియుదాత్తపదేశస్వరూపము ఇకప్రపంచమునకు వినిపించదుగదా! అందులోను ముఖ్యముగా ప్రాచ్యనాగరికతకు ఒకగొప్పఉపదేష్ట పోయినాడు- దక్షిణమునహాపరుగుదేశముపై ఆక్రమణము జేసుచూచినపుడు నిజముగావారు కన్నీరుకార్చుచున్నవి వారికుటుంబమువారికి నాహృదయపూర్వకసానుభూతి సమాశ్వాసములను దయతోఅందజేయగలరు"

## విద్యార్థులపై పోలీసుల లాఠీప్రయోగము

బొంబాయి విద్యాపీఠపుఅధికారులు ఈసారి అవిద్యాపీఠ పట్టభద్రులకు స్నాతకోపదేశము చేయుటకై సర్ మారిస్ గ్వయర్ గారిని ఆహ్వానించిరి. ఇదియిష్టములేనివారై విద్యార్థులు ఆహ్వానము నువదలుకొనుటకై విద్యాపీఠాధికారులనుకోరినను ప్రయోజనములేకపోయెను. అందుపై స్నాతకోత్సవదినమున విద్యార్థులు నల్లజెండాలనుధరించి గ్వయర్ గారికి స్వాగతమిచ్చుటకై స్నాతకోత్సవభవనముయొక్క ప్రాకారములో చేరగానిరి: వారలు తమఆగ్రహమును తెలుపు కేకలను కూడ వేయుచుండిరి. పోలీసులువచ్చి ఆవిద్యార్థులను ఆప్రాకారమునుండి తరిమివేసిరి. ఆ సందర్భములో లాఠీప్రయోగముకూడ విద్యార్థులపైచేయబడినది.

స్నాతకోత్సవము అగస్టు ౧౯ మంగళవారమునజరిగెను. సర్ మారిస్ గ్వయర్ గారు లోపలఉండిన కొద్దిమందివిద్యార్థులకును పెద్దలుసభాసదులకును స్నాతకోపన్యాసమిచ్చుచుండగా వెలుపలబెత్తములతో కట్టెలతోను, బూట్లుధరించి నకాళ్ళతోను విద్యార్థులకుసత్కారములుజరుగుచుండెను విద్యార్థులేగాక విద్యార్థినులుకూడ దెబ్బలుతినిరి. ౫౦ మందివిద్యార్థినులకు లెక్కలేనిమొత్తము ౨౫మందివిద్యార్థులు పోలీసులచేతికలారీలలోగొనిపోబడి లాకప్పులోనుంచబడిరి.రాత్రిచాలా సేపటి తర్వాత వారలు వదలివేయబడిరి-

మరునాడు బుధవారము కాలేజీలవిద్యార్థులును, కొన్ని హైస్కూళ్ళ విద్యార్థులును పోలీసు

## నిర్మాణశాఖోద్యోగిపై దుగ్యాల చంద్రయ్య దావా

హైదరాబాదు(దక్కను), మెహరు౧౪

భువనగిరి నివాసస్థుడగు దుగ్యాల చంద్రయ్య అను వ్యవసాయదారుడు తనను మహమ్మద్ యూసుఫ్ అను నిర్మాణశాఖోద్యోగి కొట్టెనని, తిట్టెనని అభియోగమును భువనగిరిమున్సిఫీలో తెచ్చియుండెను-అదిఅక్కడ ప్రభుత్వోద్యోగిపై న్యాయస్థానములో అభియోగముచెల్లదు అను కారణముతో త్రోసివేయబడియుండెను-తర్వాత దుగ్యాల చంద్రయ్య హైకోర్టులో నిగరానిపెట్టియుండెను-హైకోర్టువారు ఆఅభియోగమును విచారించవచ్చునని మున్సిఫీకిఆజ్ఞపంపిరి-మున్సిఫీలో దుగ్యాలచంద్రయ్య పక్షమున ఇద్దరుసాక్షుల వాజ్మూలములు తీసుకొన్నతర్వాత సరిపడునని అభియోగమునుకొట్టివేసిరి. దుగ్యాలచంద్రయ్య తనకుఅన్యాయమైనదని నిగరాని హైకోర్టులోప్రవేశపెట్టగా, హైకోర్టువారు దానిని విన్న సెంబరు మీదికి తీసికొనుచు ఆజ్ఞనిచ్చిరి.

దుగ్యాలచంద్రయ్యపక్షమున శ్రీయుత బి-రామకృష్ణారావుగారువకీలుగా పనిచేయుచున్నారు.

లచర్యలయెడ ఆగ్రహమునుసూచించుటకై హర్తాళుచేసిరి. కాలేజీలగేటులవద్ద విద్యార్థినీ, విద్యార్థులునిలచి లోపలికిపోదలచిన విద్యార్థులను పోవలదనికోరుచుండిరి, బళ్ళలోకి హాజరైనవారలు సాధారణంగా హాజరగువారిలో ప్రతిశత ౧౦ మందిఉండేమహాఎక్కువ. కొందరువిద్యార్థులు ఊరేగింపుగా అనేకవిధులుతిరిగిరి, అందులో ౧౦౦౦౦మంది విద్యార్థులుపాల్గొనిరి-పోలీసులు వారలపై మూడుసారులు దెబ్బలువేయవలసివచ్చెను.








Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Dn, Editor- S Prathapa Reddy B.A.B.L.,